సాధన గ్రంథ మండలి, 37.

# భక్తితత్త్వము

గ్రంథకర్త

శ్రీ నిర్వికల్పానందస్వామి

ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి.

వెల. రు 0-12-0

ఓమ్

# ప్రవేశిక

అనాదికాలమునుండి భారతదేశము ఆధ్యాత్మిక సంపదకు ప్రసిద్ధినందినది. భౌతికసంపదల నొకింత అనుభవించి తద్ద్వారమున ఆత్మతృప్తి అసంభవమని గ్రహించి నప్పటిదే ఆధ్యాత్మిక గవేషణ. సహజ సంస్కారము కలవారిమాటయే వేరు. ఒకటి రెండువందల ఏండ్లక్రింద ఈ దేశము సిరి కాలవాలమై పరదేశములవారికి కన్నుకుట్టుటకు కారణమగుట నిన్న మొన్నటి చరిత్ర. పరితృప్తితో సామాన్యభోగముల ననుభవించుచు జీవితమును గడుపుటకు అవకాశము, ధారావాహికమగు సంప్రదాయ పరంపర, ప్రకృతియొక్క అనుకూల్యము. ఈ మూడును గలసి జ్ఞాన, భక్తి, కర్మ, రాజయోగములను సాధించిన మహాపురుషులను, శాస్త్రగ్రంథములను మన కపారముగ ప్రసాదించినవి. ఏఒక్కరును ఒక జీవితమున చదివి ముగింప జాలనన్ని ఆధ్యాత్మిక గ్రంథములు ముద్రితములును అముద్రితములును భారతదేశ భాషలలో కలవు.

వర్తమాన వైచిత్ర్యమేమన: కాలపురుషుడు కబళింపగలిగినన్ని గ్రంథములను కబళింపగా, వివిధరాష్ట్రములలోని వారు ముద్రింపగలిగినన్ని గ్రంథములను ముద్రించుకొనగా, ఆంధ్రులకు గ్రంథముల నామపరిచయమైన లేకున్నది. ప్రతి విషయమునకును కారణముగనో, నిష్కారణముగనో మనము దుమ్మెత్తిపోయు ఆంగ్లేయులు ప్రామాణికముగ ప్రతిగ్రంథమును

నన్నునే అనువదించుటలో తత్సారము నవగతి మొనర్చుకొని నాను. అంతియుకాదు: సరిగా మన దేశమున నానక్, కబీర్, దాదూ మున్నగు భావసాధకులు జన్మించిన కాలముననే పాశ్చాత్యభూములలోగూడ తత్తుల్యులగు మహాపురుషు లుద్భవించి యుండిరి. వారి బోధనలు జీవితచరిత్రలు మనకింకను సరిగ తెలియవు. అయినను, ఈ విషయము ఆధ్యాత్మికవిషయ ముల సార్వభౌమ ప్రకృతిని సిద్ధముగనే, ప్రకటిత మొనర్చు చున్నది.

విదేశములలో భారతదేశముయొక్క గౌరవము ఆధ్యా త్మిక శేముషిని పురస్కరించుకొనియే. వారికి మనము యాంత్రిక విద్యను నేర్పలేము కదా! సంప్రదాయధార విచ్ఛిన్నము గాకుండ ఈ కలికాలములోగూడ భారతదేశమున సిద్ధులగు మహాపురుషులు జన్మించుచుండుటయే పరాయివారిని డిల్లపడ చేయుచుండిన వింత. అస్తు,

ఈ ఆధ్యాత్మిక వికాసము అంతర్ముఖునకే లభింపగలదు. ప్రస్తుతము సంఘమునందు పరిస్థితులు విచారమునేగాక నిస్పృ హమునుగూడ కలుగ జేయుచున్నవి. దారిద్ర్యమొకవంక శరీర మును పీడించుచుండ, దైనిక వార్తాపత్రికలు, రేడియోయంత్ర ములు, సినిమాలు చిత్తవైకల్యమును సమకూర్చుచు ఉభయ భ్రష్టత్వము నాపాదించుచున్నవి. చిత్తవినోదకరములను ఆ పాత భ్రమను కల్పించెడి ఈ త్రి—కరణములు మనస్సునెంతగ చెదరచేయు చున్నవో, వయోవృద్ధుల నడిగిన విశదము కా గలదు.

అల్డస్ హక్స్లే, ఈషర్ వుడ్, సోమర్ సెట్ మాంగమ్ వంటి సుప్రసిద్ధ ఆంగ్లసాహిత్యవేత్తలు చనుబాలతో తమకు నూరిపోయబడిన పాశ్చాత్యనాగరికతను, ఉపన్యాస త్రికరణ సమేతముగ, తిట్టిపోయుచు భారతీయ తత్త్వసిద్ధాంతముల వైపునకును — సార్వభౌమ ధర్మము వైపునకును — దృష్టి మరల్పుడని ఉద్ఘోషించుచుండ, మనకు బధిరశంఖారావతుల్యముగ నుండినది. రెండు మహాయుద్ధముల తీరు చవి చూచినను, దివాంధములనే యనుకరించుచున్నాము.

ఇట్టి పరిస్థితులలో యోగచతుష్టయముయొక్క అధ్యయన ప్రచారాచరణముల యవసరమెంతగనున్నదో వేరుగ చెప్ప నక్కరలేదు. సహస్రదళయుతమగు భక్తికమలమునందలి, ఒక్క దళమును సంగ్రహించి ఆంధ్ర మహాజనులను ఏతత్సువాసనా సృష్టులుగ నొనర్ప ప్రయత్నించుచున్నాను. ఈ ప్రయత్న ఫలముగ మిగిలిన దళముల సేవర్పునను సంగ్రహింప దొరకొనిన నాపరిశ్రమ సాఫల్యమండితమగును.

ఈ పుస్తకమున అత్యంత సంగ్రహముగ మొదట నారదమహర్షి ప్రవచించిన భక్తి వివృతమైనది. భక్తియనగనే ఏదో యొక పిచ్చియను భావమును తొలగించుటకై, ద్వితీయదళమున భక్తితత్త్వము వివరింపబడినది.

తృతీయదళము కొరకు: సాధకదృష్ట్యా చూచినయెడల శ్రీ చైతన్యమహాప్రభువులవారి యనంతర మింతవరకు నూతన ఉపాయములను బెట్టినవారు లేరు: ఇది చైతన్యయుగమే ఇంకను.

కనుక, శ్రీ యుగావతారపురుషుని సంస్మరించుకొనుచు గ్రంథమును ముగించినాను.

వచనభాగము వెనుక భారతిలోను. పద్యభాగము గృహలక్ష్మిలోను ముద్రితములైనవి. భక్తినే జీవితసర్వస్వముగ దలచు వారి పిలుపునిమిత్తము పునర్ముద్రితమగుచున్నది.

కాలవైచిత్ర్యమునుగూడ లెక్క చేయక ఆధ్యాత్మిక భావములనే ప్రచారము చేయసమకట్టి సాగించుచున్న ఉత్సాహుడు శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు! అనంతకరుణామయుడగు భగవంతుడు ఆయుష్యనుగ్రహించుగాక — ఇదియే నా ప్రార్థన.

శ్రీరామకృష్ణమఠం,
భువనేశ్వర్, ఒరిస్సా.
4-8-50

శ్రీ నిర్వికల్పానంద స్వామి.

# నివేదన

ప్రాచీన కాలమునుండియు ఆధ్యాత్మిక సాధన సంపదల కాలవాలమయినది మన భారతభూమి. కాలప్రభావానుకూలముగ మానవుల చిత్తప్రవృత్తులు మారుచుండును. ఐనను తన మానవత్వమును సఫలము చేసికొనినవాడె మానవుడు. వాని జన్మయె ధన్యము. మానవ జీవిత సాఫల్యమున కుపకరించు ఉత్తమ గ్రంథముల ప్రచురించి ప్రచారము చేయుటే మా మండలి ముఖ్యోద్దేశము, మా అభిప్రాయమును గమనించి మా గ్రంథముల తిలకించు మాకృషికి సర్వవిధముల తోడ్పడగలందులకు సహృదయుల నందరిని ప్రార్థించు చుంటిమి.

మేము కోరినతోడనే 'భక్తితత్త్వము'ను మామండలిలో నొకపుష్పముగ ప్రకటించుట కంగీకరించి మాకొసగిన, పూజ్యపాదులు శ్రీ నిర్వికల్పానందస్వామి వారికి మా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.

తెనాలి.<br>1950, ఆగష్టు

సంపాదకులు:<br>సాధన గ్రంథ మండలి.

# వి ష య ము

# భక్తితత్త్వము

## ప్రథమదళము

లీలావిలాసినే భక్తిమంజరీ లోలుపాలినే
మౌగ్ధ్యసార్వజ్ఞ్యనిధయే గోకులానంద తే నమః.

(విశ్వనాథ చక్రవర్తి)

మనకు లభ్యములగు ప్రాచీన భక్తిశాస్త్రగ్రంథములలో నారదభక్తిసూత్ర మొక ఉత్కృష్టగ్రంథము. నారదు డీ గ్రంథమున భక్తి'తత్త్వము'ను గుఱించి ఎక్కుడుగ ఆలోచింపక పోయినను, సాధనను విశదముగ నుడివియుండుటను కనగలము. కనుక, భక్తిపథము ననుసరించువారు దీనిని విశేషముగ సమాదరించుచున్నారు. సాధనామూర్తియగు శ్రీ రామకృష్ణపరమహంస ఈశ్వరదర్శన పిపాసువులగువారికి నారదీయభక్తియే ఈ కలియుగమున శ్రేష్ఠమని వచించుచుండెడివాడు.

పూర్వ మీ దేశమున విద్య గురుపరంపరాక్రమముగ ఉపదిష్ట మగుచుండెడిది. శిష్యుని సుఖబోధకై శాస్త్రములన్నియు సూత్రరూపమున సంగ్రహింప బడెడివి. అల్పాక్షరములలో అసందిగ్ధముగ సారతత్త్వమును చెల్పుటయే వీని విశేషము. ఇట్టిదే నారదుని సూత్రగ్రంథము. ఇందు పది అధ్యాయములుగ విభజింపబడిన ఎనుబదినాలుగు సూత్రము లున్నవి.

తదితరసూత్రములకువలె దీనికి భాష్యముగాని టీకగాని యున్నట్లగుపించదు. సూత్రము లత్యంత సరళములును, విశదములును అయియుండుటచే దీనికి గారణము కావచ్చును. మద్రాసు రామకృష్ణమఠమువారు ప్రచురించిన ఆంధ్రానువాద మొకటి యున్నది. ఆంగ్ల-అనువాదము కూడకలదు.

ఈశ్వరుని ప్రతి పరమప్రేమయే భక్తియని నారదుడు నిర్దేశించియున్నాడు. ఈభక్తి అమృతస్వరూపము.

ఇంత కెక్కుడుగ నారదుడు భక్తిని గురించి చెప్పలేదు. బహుశః చెప్పజాలకపోయియుండవచ్చును. తరువాత "మూగ రుచిమొక్క అనుభవమును చెప్పజాలనట్లు, ప్రేమస్వరూపమును గూడ నోటితో చెప్పజాలము." అనెను.

వర్ణన ప్రత్యక్షపరముగగాని, పరోక్షముగగాని యుండవచ్చును. ప్రత్యక్షవర్ణన అసంభవ మగుటవలన నారదు డొనరించిన పరోక్షవర్ణన ననుసరించి ఏవస్తువునుబొందిన మనుష్యుడు సిద్ధు డగునో, అమృతు డగునో, తృప్తు డగునో అదియే భక్తి. ఏ వస్తువును బొందిన మనుష్యు డిక నెద్దానిని గోరకుండునో, దేనికొఱకు శోకింపకుండునో, ఎవరినిగాని ద్వేషింపకుండునో, జగత్తునందలి మరేవస్తువునైన పొందిన ఆనందము బొందకుండునో, లేక ఎద్దానినైన పొంద నుత్సహింపడో అదియో భక్తి. దేనిని గ్రహించిన మనుష్యుడు మత్తుడును, స్తబ్ధుడును, ఆత్మారాముడును నగునో నయ్యదియే భక్తి.

ఈ భక్తియం దెట్టికోరికయు యుండజాలదు. ఏలయనగ, నిద్యది నిరోధస్వరూపము.

లోకప్రాప్తములగు వస్తుజాలమునుండి ఒకానొక ఉత్కృష్టతమవస్తువును గ్రహించినను, ఈ భక్తిలక్షణము లన్నియును దానియందు వర్తింపజాలవు. భోగవాసనా పరిచాలితులయ్యు కొందఱికి అభీప్సితవిషయము తాత్కాలికముగ తాదృశమని తోచినను, ఆ భ్రమ నశించు దిన మచిరముననే అరుదెంచును. కనుక, భక్తి అలౌకికమగు అపూర్వవస్తువు.

సామాన్యముగ మనము శాస్త్రవిధులను సాంఘిక నియమముల ననురించి నలుపుచుందుము. మనుష్యు డీ భక్తిని బొందిన సాంఘిక శాస్త్రీయవిధులను దాటిపోవును. అప్పు డీ నియమము లాతని మనస్సును అరికట్టజాలవు. అతడు లౌకిక శాస్త్రీయ విషయములను పరిత్యజించును. నారదీయపరిభాషలో నీ త్యాగమే నిరోధము. భక్తిని బడసిన మనుష్యుడితర ఆశ్రయములన్నిటిని పరిత్యజించి, హృదయము నీశ్వరుని కొఱకే సమర్పించును. ఇతర విషయములలో నాతడుదాసీనుడగును. భక్తికి సాహాయ్యకరములగు లౌకిక శాస్త్రీయానుష్ఠానములను గ్రహించుట కాతని కభ్యంతరము లేదు కాని, తదితరవిషయములను సంపూర్ణముగ త్యజించును.

భక్తి లక్షణమును వర్ణించు సందర్భమున నారదుడు ఇతరాచార్యుల అభిప్రాయములనుగూడ పేర్కొనినాడు. అందు పూజాదుల అనురాగమే భక్తియని పరాశరుడు. భగవత్కథానురాగమే భక్తియని గర్గుడు. విరోధహీనమగు ఆత్మరతియే భక్తియని శాండిల్యుడు. కాని, నారదుడు ఈశ్వరునియందు సమస్త ప్రాపంచికవిషయములను సమర్పించుటయు, ఆయనను విస్మరిం

చుటవలన పరమవ్యాకులత కలుగుటయు అను విషయములనే భక్తిలక్షణములని సర్వ్యాచించి, తన అభిప్రాయమును తేటపఱచెను.

అయిన, నారదునకు ప్రాచీనాచార్యులయందు విశ్వాసము లేదా అను ప్రశ్న జనింపవచ్చును. గౌరవము లేక పోలేదు. ఈలక్షణముల నాత్డు భక్తిని ఏకాదశధా విభజించిన చోట అంతర్గత మొనర్చుకొనియే యున్నాడు. కేవలము పూజాదుల అనురాగమని ఊరకున్న, అది క్రియాకలాపము లనబడు యాంత్రిక నియమమున బద్ధమై యుండిపోవు నను భయమున్నది. ఒకడా జీవితము ఈ క్రియల నొనర్చుచుండినను, చిత్తశుద్ధి కలుగక పోవచ్చును. అతడు 'జయించితిని' అని భ్రమపడవచ్చును. ఇట్లే కథాదుల అనురాగ మనిన నద్యాది కేవలము శ్రవణముతోడనే పరిసమాప్తము కావచ్చును. ఆత్మరతి శుష్క జ్ఞాన విచారముగ తేలిపోవచ్చును. కనుక నారదుడు ఏతద్దోష విరహితమగు లక్షణమును నిర్దేశించి, ఇట్లగుట సంభవమా అను శంకను లేవదీయువారికి "వ్రజగోపికలయం దిట్లు జరిగిన" దని ప్రత్యుత్తరించినాడు.

ఈభక్తి అనిర్వచనీయమైనను 'క్వాపి పాత్రే' ప్రకాశిత మగుటను మనము కాంచగలము. ఇది సత్త్వ రజస్తమములను గుణముల కతీతము. ఇందెట్టి కామనయు ఉండదు. ఇయ్యది వికారవిహీనమగు సూక్ష్మానుభవము. ప్రతిక్షణము వర్ధిత మగుచునే యుండును. దీనిని బడసిన సాధకుడు కేవల మద్దానినే కాంచును, వినును, నుడువును, చింతించును.

ఇంతవఱకు కాలోచింపబడిన భక్తి పరిపక్వావస్థ యందే సంభవించును. మనుష్యుడు ప్రప్రథమముననే ఈస్థితిని బడయ జాలడు. ప్రథమమున నాతడు అత్యంత సామాన్యమగు స్థితి నుండి పైకి లేవవలసియుండును; తుద కీస్థితినే బొందవలయును. ఇదియే భక్తుని ఆదర్శము. ఆదర్శము సంపూర్ణముగ మనస్సున చిత్రితమై యుండకపోయిన పథ మెట్టిదో తెలియక చిక్కుపడ వలసియుండును. సిద్ధి కంతరాయము లనేకముగ వాటిల్లును. కనుక, లక్ష్యము నత్యంతవిశదముగ నారదుడు వర్ణించినాడు. ఈ పరిపక్వస్థితిని వర్ణించుచు, ఆయన నిమ్నతరసోపానములను విస్మరింప లేదు. ఆయన అనిర్వచనీయమగు గుణాతీత ముఖ్య భక్తినుండి ఒకింత క్రిందకు దిగి గుణభేదము, అధికార భేద ముల ననుసరించు గౌణభక్తియొక్క త్రైవిధ్యమును నిరూ పించినాడు. గుణముల ననుసరించి సత్వ, రజ స్తమోరూప ములుగను, అధికారభేదము ననుసరించి ఆర్త, జిజ్ఞాసు, అర్థార్థి రూపములుగను నియ్యది ప్రకాశితమగును. వీనిలో పూర్వ పూర్వములు శ్రేయతమములు.

అర్థార్థి ఈశ్వరుని భోగసుఖములకొఱకు ప్రార్థించును. జిజ్ఞాసువు జ్ఞానముకొఱకు. ఆర్తుడు దుఃఖితుడై హృదయపూర్వ కముగ, గజేంద్రునివలె ఆహ్వానించును.

సత్వగుణియగు భక్తుడు అత్యంత మేకాంతమగుచోట ధ్యాన మొనరించును నిద్రించుచున్నాడని అందఱును తలంతురు. కాని, అతడు దోమతెరమాటున, రాత్రినంతయు ధ్యానముననే గడపివేయును. ఆరోగ్యము సరిగ లేనందున ఇకను పక్క విడువ

లేదని నలుగురు ననుకొందురు. ఈవైపున, శరీరముపట్ల ఆదర
రము ఆకలితీరునంతమటుకు శాకాన్నము లభించినచాలును.
ఆహారవసనముల ఆడంబరములేదు. ఇంటిలో వస్తువులను కూడ
బెట్టుటలేదు. ఇతరులను పొగడి ఆత డెప్పుడును ధనమును సం
గ్రహింపడు. పత్రపుష్పములతో ఆతని పూజ ముగియును.

రాజసికభక్తుడు తిలకమును దిద్దును, రుద్రాక్షమాలను
ధరించును. ఆ మాల బంగారముతో చుట్టబడియుండును. పూజ
చేయునప్పుడు పట్టుబట్ట కట్టుకొనును. నానావిధ నైవేద్యముల
నర్పించును. ఎవ్వరైన నింటికివచ్చిన 'ఈవైపున ఇంకను చూడ
వలసినది ఉన్నది' అని దేవతా గృహమును చూపును.

"తామసిక భక్తుని విశ్వాసము తీక్ష్ణము. 'ఒకసారి
ఆయననామమును ఉచ్చరించితిని – ఇంకను పాపమా?' అనును.
బందిపోటువేసి ధనమును దోచుకొనునట్లు, ఆత డీశ్వరుని
నొత్తిడిపరచును. కొట్టుము, కట్టుము, నరకుము—— ఈరీతిగ
బందిపోటు జరుగునట్లు" అని శ్రీరామకృష్ణ పరమహంసులు తమ
సహజ సరళభాషలో వర్ణించియుండిరి.

గౌణభక్తిని గురించి నారదుడింకేమియును చెప్పలేదు.
జీవితమున అన్నిటికంటె కఠోరమగు సత్యముగ వచ్చి
నిలచునది మృత్యువు. దీనిని ఎవరును తప్పించుకొనజాలరు.
కాని, మనుష్యుడు ఆదిసర్గమునుండి మృత్యుపారమును జేరి
అమృతత్వమును బడయ అభిలషించుచున్నాడు. అత డమృత
స్వరూపు డగుటవలన, యుగయుగాంతరములనుండి, మృత్యు
వక్షమున నిలబడి దానిని జయింపయత్నించుచున్నాడు. రూప

రసాదులతో గూడిన విశ్వమును తనలోనికి ఆకర్షించుకొనుట కేతని వ్యర్థయత్నము. కాని, అత డెంతగ భోగించినను తృప్తి యనునది లభింపకున్నది. అతనిహృదయ మింకను, చాలగ, ఉత్కృష్టమగుదానిని బడయ నాకాంక్షించును. అతడు భూమా స్వరూపుడగుటవలన, అతనికి క్షుద్రవిషయములు తృప్తినొసగ జాలకున్నవి. దుఃఖ మనంతముగ సలుపుచున్నను, ఆతడు సుఖాశను పరిత్యజింపజాలడు. ఆనందస్వరూపు డగుటవలన సర్వావస్థల నాతడు కోరునది ఆనందమే.

మనము బొందగోరు వస్తువును ఇష్టమందురు. అమృత స్వరూపమును, ఆనందమయమును నగు భూమావస్తువే మన ఇష్టము— మన యథార్థసత్త. ప్రతి ప్రాణియును ఈవస్తువును బొందుమార్గముననే—తమకు తెలిసియున్నను తెలియకపోయినను—నడచుచున్నారు. మాయ, లేక అజ్ఞానమువలననే మనకు ఇష్టప్రాప్తి యగుచుండుట లేదని విశేషజ్ఞుల అభిప్రాయము. ఈ ఇష్టప్రాప్తికి వారు నిర్దేశించిన మార్గములు భక్తి, కర్మ, జ్ఞాన, యోగములు. వీనియందు ఇది తక్కువది, ఇది గొప్పది అను భేదము లేదు. దేశ కాల పాత్రముల ననుసరించి అధికారి భేదము ననుసరించి ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కటి ప్రయోజనీయ మగును. గీతోపదేశకుడగు శ్రీకృష్ణునియొక్కయు, దక్షిణేశ్వరవాసి యగు శ్రీరామకృష్ణునియొక్కయు ధర్మవాణియందు సమదృష్టితో గూడిన యోగచతుష్టయ సమ్మేళనము ధ్వనించియున్నది. ఈ సమన్వయవాణి జగత్తుయొక్క ఆధ్యాత్మిక చరిత్రయం దశ్రుతపూర్వము

మత ప్రచారకుల మాట విడచినను, మహాపురుషులనబడువారిలో చాలమంది పక్షపాతబుద్ధిని వదలజాలకపోయిరి.

నారదుడు కర్మ, జ్ఞాన, యోగములకంటె భక్తియే శ్రేష్ఠమని నుడువుచున్నాడు. కారణము— సమస్తసాధనల ఫలము భక్తి. ఇతర సాధనలలో అభిమానమునకు తావున్నది. ఈశ్వరు డభిమానమును క్షమింపడు. ఆయనకోరునది దైన్యము. భక్తి సాధకునియందు దీనతను విస్ఫారజేయును. అందువలన భక్తియే శ్రేష్ఠము. జ్ఞానసాధనవలన భక్తి లభించునని కొందరు, జ్ఞానభక్తులు పరస్పర సాపేక్షము లని మఱికొందరు. కర్మ, యోగ, జ్ఞానముల సాయము నపేక్షింపకయే భక్తి ఫలప్రద మని బ్రహ్మకుమారుల అభిప్రాయము. రాజప్రాసాదమును గాంచిన రాజదర్శన మగుచుండుట లేదు. ఖాద్యవస్తువుల గాంచిన క్షున్నివృత్తి కాజాలదు. అట్లే భక్తిరహితములగు ఇతర సాధనలును. అందువలన ముముక్షువులకు భక్తియే గ్రహణీయము.

అయిన, ఇతర సాహాయ్యము నపేక్షింపకయే సాధన సంభవమగునా? 'విచార' మొనర్పకుండ భక్తి పథమును మనము గ్రహించుచున్నామా? ఇష్టచింత 'మనస్సంయమము' లేకున్న ఒనర్పగలమా? భగవద్గుణానువర్ణన, శ్రవణములు 'కర్మ' కాదా? అను ప్రశ్నలకు జవాబీయవలసివచ్చిన, ఇవి జ్ఞాన, యోగ, కర్మాంతర్గతము లనదగును. కాని, వీటినిగూడ భక్తి యోగాంగముల గ్రహించి 'భక్తి'గ నారదుడు నిర్వచించి యున్నాడని గమనింపనగును. కనుకనే, ఇతర యోగముల సాహాయ్యమవసరము లేదనెను.

అదియునుగాక, మనుష్యులను బరీక్షించి చూచిన జ్ఞాన యోగముల కధికారులగువారు 'నూటికి కోటికి' ఒక్క రగు సింతురో అగుపింపరో చెప్పజాలము, కర్మ మనుష్యుని సహజ ప్రవృత్తి. ఏదో ఒక కార్యము నాచరింపనిదే అత డుండజాలడు. ముసలితాతను ఏమిచేయుచున్నావని ప్రశ్నింపుడు. "ఏమియును సోచక దడి కట్టుచున్నా" ననియో లేక "పాదుకు మడి కట్టు చున్నా"ననియో వచించును. అందువలన చాలమంది దీక్ష కధి కారులు. తరువాత, ప్రేమయనునదిగూడ మనుష్యుని సహజ ప్రవృత్తి. దేనినో ఒకదానిని ప్రేమింపకుండ అతడుండజాలడు. ఈ ప్రవృత్తిని భగవదభిముఖీన మొనర్చుటయే భక్తి.

కనుకనే, నారదుడు ఇతర ఉపాయములకంటె భక్తియే ఇష్టలాభమ్మునకు సహజోపాయ మనుచున్నాడు. దీనిని నిరూపింప ఇతరప్రమాణముల అవసరము లేదు. భక్తియే స్వయముగ దీనికి ప్రమాణము. భక్తిసాధనవలన సాధకుడు శాంతిని బడయును. పరమానందమును బొందును. అందువలన భక్తిపథము సహ జము, భక్తియే శ్రేష్ఠము.

కాని, జగత్తునందలి సాధకుల నందఱిని ఈ భక్తిపథము ననే ప్రవేశపెట్ట మనము కోరిన, వ్యర్థకాముల మగుదుము. అందఱికిని ఒకే కొలతగల చొక్కా సరిపడదు. జ్ఞానము, లేక కర్మను ఉపాయముగ గైకొను అధికారముతో జన్మించినవారికి భక్తి ఉపకారము నొనర్పజాలదు. అగుచో, నారదుని అభి ప్రాయ మందఱును భక్తినే అవలంబింపవలె ననియా ?

కాదు. నారదుడీవిషయమున ఔదార్యమునే చూపినాడు. తనగ్రంథము కేవలము భక్తిసాధకులకేయని నుడువుచున్నాడు.

భక్తులలో ఏకాంతికభక్తులే శ్రేష్ఠులు. వారు పరస్పరము ఈశ్వరుని గురించి సంభాషింతురు. ఆనందమున కంఠరోధమగును, ఆనందబాష్పములు పడును, శరీరము పులకితమగును, వారివంశము పవిత్రమగును. పృథివి పావనమగును. వారివలన తీర్థములు తీర్థములగును. కర్మము సుకర్మమగును; శాస్త్రములు సత్ శాస్త్రము లగును. వారు సర్వదా తన్మయులై యుందురు. వారి పితృదేవతలు ఆనందింతురు. దేవతలు నృత్యమొనర్తురు. పృథివి సనాథయగును. వారియందు జాతి, విద్యా, రూప, కుల, ధన భేదములు లేవు. కర్మగతముకాని, లేక అన్యవిధముగునట్టిగాని భేదముకూడ ఉండదు. ఏలయన వారు భగవంతునికి జెందినవారగుచున్నారు. భక్తులకును భగవంతునకును భేదము లేదు. ఇక, గౌణభక్తుల ప్రసంగ మేమియును కానరాదు

భక్తిలాభమునకు ముఖ్యోపాయము మహాత్ముల కృప; లేక, భగవంతుని కృపాలేశము. మహాత్ముల సంగము దుర్లభము, అగమ్యము. కాని, అమోఘము. మహాత్ములకృప కేవలమున్న చాలును, భక్తిలభించియే తీరును. ఏలయన, భక్తునకు భగవంతునకు భేదము లేదు.

“భక్తునిహృదయము భగవంతుని కచ్చేరీసావిడి. బాబుగారు తమ ప్రాసాదమునందంతటను తిరుగుచున్నను, ముఖ్యముగ ఆయనదర్శనము కచ్చేరీ సావిడియందే లభించును. కనుక, భక్తు

నకు భగవంతునకు భేదము లే"దని శ్రీరామకృష్ణపరమహంస నుడివెడువాడు. ఒకతడవ ఆయన భాగవతపురాణమును వినునప్పుడు ఒక 'అనుభూతి' కలిగెను. అది: శ్రీకృష్ణుడు ప్రత్యక్షముగ నిలువబడియుండెను. ఆయననుండి కాంతికిరణ మొకటి వెలువడి భాగవతమును స్పృశించి, పిదప పరమహంసనుగూడ స్పృశించెను. అచ్చటనుండి ఆయన ఉపర్యుక్తమగు ఉపదేశమును ఒనర్చుచుండెడివాడు.

నిరంతరము, అవిరామముగ భగవద్భజన నొనర్ప నారమని ఆదేశము. సుఖదుఃఖములు, లాభాలాభములు మున్నగు వానిని పరిలక్షింపక, నిముషమాత్ర కాలమైన వ్యర్థ మొనర్పక సర్వవిధముల నిశ్చింత చిత్తముతో ఈశ్వరభజన నొనర్పవలెను. ఇతరులకడ భగవద్గుణశ్రవణ మొనర్చినను, కీర్తన మొనర్చినను భక్తి సాధితమగును. భగవంతుని నామగుణగాన మొనర్ప, ఆయన శీఘ్రముగ ఆవిర్భవించును. భక్తుల నాతడు తన ఉనికిని అనుభవించున ట్లొనర్చును. దాస్యభావమునో, లేక మధుర భావమునో అవలంబించి, ఆయనయందు ఐకాంతిక భక్తిని నిల్పనగును. భక్తియే సాధ్యము, దానినే సాధింపుము.

భక్తిశాస్త్రముల మనన మొనర్పుము. భక్తిని వృద్ధి నొనర్చు కార్యముల నొనర్పుము. వాగ్వాదముల నొనర్పకుము. దాన వ్యర్థ విషయము లనుదెంచుట కవకాశమున్నది. వాగ్వాదమునకు మితి లేదు. అహింసాదులను పాలింపుము.

అభిమానము, దంభము మున్నగువానిని పరిత్యజింపుము. ధన, శత్రు, నాస్తిక, స్త్రీపరిసంగముల వినకుము. ఇతరులు అప

కార మొనర్తురనిగాని, లేక ఇతరుల కపకారమొనర్పవలెనని గాని చింతింపకుము. ఏలయన, నీసర్వస్వము—లౌకిక శాస్త్రీయ కర్మలు ఈశ్వరుని కర్పింపబడినవి. విషయములను పరిత్యజింపుము. దుస్సంగమును సర్వదా పరిత్యజింపుము. దీనినుండియే కామ, క్రోధ, మోహ, స్మృతిభ్రంశ, బుద్ధినాశ, సర్వనాశములు సంభవించును. దుస్సంగమున, అలలుగనున్న దుర్గుణములు సముద్రముగ మారగలవు.

భక్తుని కర్మములన్నియు భగవంతునికే నివేదింపబడినవి. కనుక కామ, క్రోధ, అభిమానముల బూనవలసిన, ఆయన పట్లనే వహింపుము. అనగా, ఈవృత్తుల నన్నిటిని ఆయన వైపునకే మళ్లింపుము. ఆయనదర్శనమును గోరుము. దర్శన ప్రతిరోధకములపై క్రోధమును బూనుము. సాక్షాత్కరింప వేమని అభిమానమును దాల్చుము.

సాధనాసమయమున భగవంతునితో నొకసంబంధమును స్థాపించుకొనినయెడల భక్తి దృఢమగును. సాధనకూడ సహజమును మధురమును అగును. భగవంతునిపట్ల భావస్థాపనమునే నారదుడు ఆసక్తి యనుచున్నాడు. ఈ ఆసక్తి ఒక్కటియే యైనను, గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, కాంతాసక్తి, వాత్సల్యాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయాసక్తి, పరమవిరహాసక్తి, అని పదకొండు రూపములను ధరించుచున్నది.

నారదుడు చెప్పిన భక్తిలాభోపాయములు ఇవి. అవి: మహాత్ముల, లేక భగవంతుని కృప, ఏకాంతికభజన, భక్తి

శాస్త్రానుశీలన, కుసంగపరిత్యాగ శీలనిర్మాణములు, భగవంతుని పట్ల ప్రవృత్తి వ్యావృత్తీకరణము, భావాశ్రయణము అనునవి.

అనురాగమునకు ఉదాహరణ వ్రజగోపికలు. వారియను రాగమున మాహాత్మ్యజ్ఞానము లేదనుట అపవాదము! అది లేకున్న జారత్వమే యగును. ప్రేమాస్పదుని సుఖమే తన సుఖమను భావము జార ప్రేమయందు లేదు.

సాధనపథమున ప్రధానాంతరాయము మాయ, లేక అజ్ఞానము. ఈమాయ నెవరు తరింపగలరు? సంగత్యాగి, సాధుసేవి, నిర్మముడు అగువాడును, నిర్జనవాసియు, లోకబంధ రహితుడును, త్రిగుణాతీతుడును, యోగక్షేమరహితుడును, కర్మత్యాగియును, కర్మఫలత్యాగియును, ద్వంద్వహీనుడును, విధి నిషేధముల కతీతుడును, నిరవచ్ఛిన్న అనురాగియును నగు వాడొక్కడే మాయను తరింపగలడు. తరించుటయే కాదు, ఇతరులనుగూడ తరింపజేయగలడు.

విధి నిషేధములను, అనగా వానిని విధించు శాస్త్రములను త్యజింప నుపదేశించుటవలన నారదుడు శాస్త్రవిరోధి యనుకొనరాదు. భక్తి దృఢమగువఱకు ఆయన వానిని మన్నింపమనియే నుడివియున్నాడు. లేకున్న పతితుడ వగుదువు. సర్వస్వము భగవంతునకు నివేదింపజాలనంతవఱకును లౌకికర్మలను విడువగూడదు. ఈశ్వరునియందు దృఢబుద్ధి కలిగినచో లౌకిక కర్మ లుండవు. శరీరపాత మగునంతవరకు భోజనాది కర్మలు మిగిలియుండును.

విరుద్ధవాదముల నుపేక్షించి, కుమార, వ్యాస, శుక, శాండిల్య, గర్గ, విష్ణు, కౌండిల్య, శేష, ఉద్ధవ, ఆరుణి, బలి, హనుమంత, విభీషణాది భక్తియోగాచార్యులతో నేకీభవించి, నారదుడు సమకూర్చిన శిక్షోపదేశమును విశ్వసించినచో శ్రద్ధాళులగువారు ఇష్టవస్తువును బొందెదరు. సందేహము లేదు.

వర్తమానకాలమున జగత్తునందు ఉన్న మతముల సమీక్షచేసి, ముఖ్యముగ వాని ఆనుష్ఠానికభాగమును పరిశీలించి చూచినచో నారదు డుపదేశించిన అమృతోపమ మగు ఈ భక్తియే విభిన్నరూపముల అభివ్యక్తమగుచు, ఆయాసాధకులకు నిర్మలమగు ప్రశాంతిని ప్రసాదించుచుండుటను కనగలము.

న ధర్మనిష్ఠోఽస్మి నచాత్మవేదీ, న భక్తిమాం స్త్వచ్చరణారవిందే,
అకించనో ఽనన్యగతి శ్శరణ్యం, త్వత్పాదమూలం శరణం ప్రపద్యే.

(శ్రీ యామునాచార్యులు)

# భక్తి తత్త్వము

## ద్వితీయ దళము

### భక్తి భావ రస విచారము

అఖిల రసామృత మూర్తిః ప్రసృమరరుచి రుద్ధ తారకాపాలిః
కలితశ్యామా లలితో రాధాప్రేయాన్ విధుర్జయతి.

(భక్తిరసామృతసింధువు.)

సేవార్థమున పఠితమైన 'భజ్' ధాతువు 'క్తి' ప్రత్యయముతో గూడగా 'భక్తి' శబ్దము నిష్పన్నమగుచున్నది. ఈ శబ్దము ప్రాయికముగ ఈశ్వర ప్రేమాకారమును దాల్చిన మానసికవృత్తిని నిర్దేశింప శాస్త్రములు వ్యవహరించుచున్నవి. చిన్నలు పెద్దలపట్లచూపు గౌరవమయ భావపరముగ గూడ ఈ పదము లోకమున ప్రయోగింపబడుచున్నది. శాస్త్రీయ మగు భక్తినే గౌడీయ గోస్వాములు సర్వోత్కృష్ట మగు పంచమ పురుషార్థముగ గ్రహించి, ప్రపంచించియుండిరి. సాధ్యమైనంతవరకు వారి భాషలోనే వారి ఆశయమును దెల్పెదము.

ఈ భక్తి సాధనభక్తి, ప్రేమభక్తి యని ద్వివిధము. వైధీ, రాగానుభక్తులు సాధనభక్త్యంతర్గతములు. అపరా-పరా, గౌణీ-ముఖ్యములను నామాంతరములుగూడ వీనికున్నవి.

" శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్,
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ "

అని భాగవతకారుడు నిర్వచించిన సాధనభక్తియే-నవధా భక్తియే అభ్యాసఫలముగ 'రాగానుగ' యగును. ఇట బాహ్య క్రియాకలాపము నపేక్షింపకయే భగవల్లీలారసాస్వాదనము భక్తునకు లభించును, ఈ సాధనభక్తియొక్క మహాత్ఫలమే ప్రేమభక్తి. మొదటిది ఉపాయము; రెండవది ఉపేయము.

ఈ భక్తిని శ్రీరూపగోస్వామిపాదు లిట్లు నిర్వచించి యున్నారు:

" అన్యాభిలాషితాశూన్యం జ్ఞానకర్మాద్యనావృతమ్,
అనుకూల్యేన కృష్ణాను శీలనం భక్తిరుత్తమా." (భ. ర. సిం)

భుక్తి, ముక్తి, యోగసిద్ధి, ఐశ్వర్యవాంఛ మొదలుగాగల ఇతరవాంఛల నభిలషింపక, సాధనభక్త్యంగములగు జ్ఞాన కర్మాదుల సాయము నపేక్షింపక, త్రికరణములను శ్రీకృష్ణపర మొనర్చుటయే ఉత్తమభక్తి (ప్రేమభక్తి).

ఈ ప్రేమభక్తి లభించు క్రమ మియ్యది :

" ఆదౌ శ్రద్ధాతతః సాధు సంగో థ భజనక్రియా,
తతో నర్థనివృత్తిః స్యా త్తతో నిష్ఠా రుచి స్తతః,
అథాస క్తి స్తతోభావ స్తతః ప్రేమోదయశ్చ నః
సాధకానామయం ప్రేమ్ణః ప్రాదుర్భావే భవేత్క్రమః "(భ. ర. సిం.)

ప్రథమమున 'శ్రద్ధ' అవసరము. ఈ శ్రద్ధ సాధుసంగ మునకు గారణమగును. సాధుపురుషుల ఆచార వ్యవహారముల

గొంచు, వారి ననుసరింప బుద్ధి పొడమును. ఫలితముగ భగవద్భజనాభ్యాస మలవడును. భజనవలన అనర్థములు తొలగిపోవ నిష్ఠ, రుచి, ఆసక్తులు క్రమముగలభించును. ఆసక్తియే భావము గను, తదాశ్రయములగు రసములుగను పరిణతి నందును. సర్వరసముల సమాహారమే ప్రేమయనబడు మహాభావము.(1)

భక్తిశాస్త్రమున దృఢప్రత్యయ ముండుటయే 'శ్రద్ధ'. ఇయ్యది శాస్త్రోక్త విషయాచరణ రూపమున ప్రకాశము నందును. జిజ్ఞాస ఉదయించును. ఈ శ్రద్ధయే గురుచరణముల నాశ్రయింపజేయు, తద్ద్వారమున సాధుసంగమము లభించును.

సాధుసంగమఫలముగ భజనాసక్తి గలుగును. ఈ భజన అనిష్ఠితము, నిష్ఠితము అని ద్వివిధము. అనిష్ఠితమగు ఆసక్తి 'ఉత్సాహమయి', 'ఘనతరల', 'వ్యూఢవికల్ప', 'విషయసంగర' 'నియమాక్షమ', 'తరంగరంగిణి' అని షడ్విధము.

శాస్త్రాధ్యయనమును ఆరంభించిన బాలుడు ప్రాథమిక దశలో లోకశ్లాఘ్యమాన మగు పాండిత్యమును బొంద నుత్సాహమును జూపును. ఇట్టి భావమే "నేను నలుగురిచేతను భక్తుడ

1. "కృష్ణస్య సుఖే పీడాశంకయా నిమిషస్యాపి అసహిష్ణుతాదికం యత్ర, సరూఢో మహాభావః. కోటిబ్రహ్మాండగతం సమస్తసుఖం యస్య సుఖస్య లేశోఽపి న భవతి, సమస్తవృశ్చిక సర్పాది దంశకృత దుఃఖమపి యస్య దుఃఖస్య లేశో న భవతి. ఏవంభూతే కృష్ణసంయోగ వియోగయోః సుఖదుఃఖే యతో భవతః సః అధిరూఢః మహాభావః. అధిరూఢస్యైవ 'మోదన' 'మాదన' ఇతి ద్వే రూపే భవతః"

శ్రీ విశ్వనాథ చక్రవర్తి.

ననిని అనిపించుకొనవలెను" అనునట్టి భక్తునకుగూడ కలుగును. దీనిచే ఉత్సాహమయమగు అనిష్ఠిత భజనాసక్తి యందును. ఆరంభించిన శ్రవణాది భక్త్యంగములను ఒక్కొక్కప్పుడు నిర్వహించుట, మఱియొకప్పుడు రసానుభూతి కొఱతవలన నిర్వహింపకుండుట అనుస్థితి యే ఘనతరల. సోమరితనము వచ్చి పట్టుదలను తగ్గించుట యే ముఖ్యకారణమగును. "భార్యాపుత్రాదులనుగూడ భక్తుల నొనర్చి గృహముననే యుండి భగవత్సేవ నొనర్తునా? లేక, బృందావనాది పుణ్యప్రదేశముల కరిగి ఏకాంతసాధన నొనర్తునా? దారపుత్రాదులను త్యజింపవలసిన ఇప్పుడే త్యజింతునా? లేక, భుక్తభోగినై వార్ధక్యమున వీడుదునా? "అతృప్తస్తా ననుధ్యాయన్ మృత్యోరంధం విశత్తే తమః—తావద్రాగాదయస్తేన స్తావత్ కారాగృహం గృహమ్" (ఇంద్రియములు చరితార్థత నందనంతవఱకు నియమిత భోగముల ననుభవింపుము; వానిని తృప్తిపరపక మనసా ధ్యానించిన నరకమునకు బోవుదువు. కామక్రోధములున్న, గృహమే కారాగృహము) అని గార్హస్థ్య సన్న్యాసధర్మముల విధియున్నది. వీనిలో నెయ్యది ఆశ్రయణీయము? కీర్తన, కథాశ్రవణము మున్నగు అంగములలో నెద్దానిని గ్రహింతును? అంబరీషాదులవలె అనేకాంగమగు భక్తిని గ్రహింతునా? అను వివిధవికల్పనలచే పీడింపబడు స్థితియే వ్యూఢవికల్పము. "విషయావిష్టచిత్తానాం విష్ణ్వావేశః సుదూరతః, వారుణీ దిగ్గతం వస్తు వ్రజన్నైంద్రీం కిమాప్నుయాత్" అను వాక్యమువలన ప్రబోధింపబడి, విషయభోగముల పరిత్యజింపజేయు యత్నమే విషయసంగరము. ఇట్టి, భక్తి నొక్కొక్కప్పుడు విషయేచ్ఛను త్యజించుట, మఱొకప్పుడు

విషయేచ్ఛవలన జయింపబడుచుండును. "ఇంత జపమును జేయు దును. ఇన్ని తడవలు ప్రణామ మొనర్తును, భగవ దసంబంధము లగు వాక్యములను వినను, నుడువను" మొదలగు నియమము లను స్వేచ్ఛాపూర్వకముగ విధించుకొనియు, వానిని సంపూర్ణ ముగ ఆచరింపజాలకుండుట నియమాక్షమ. భజన ప్రభావఫలిత ముగ జనానురాగము, సంపదలు, సిద్ధులు అను తరంగములు లేచి, భజనక్రియ నాఘాతపరచు స్థితియే తరంగరంగిణి. భక్తుని జూచి జనులు సామాన్యముగ గౌరవమును, అనురాగమును జూపుదురు. 'సర్వ భూతాంతరాత్మ'డగు హరి నర్చించుట వలన స్థావర జంగమాత్మకమగు జగత్తు తృప్తినందును. అప్పుడు విషయసుఖములు, అణిమాది అష్టసిద్ధులు వచ్చి భక్తుని ఆశ్ర యించును. లేక, భక్తుని దార్ఢ్యమును బరిశీలింప మహా మాయయే ఈ ప్రలోభనముల జూపవచ్చును. (2)

ఈభజన క్రియాఫలితముగ అనర్థము లన్నియును తొలగిపోవును. అనర్థములు దుష్కృతోత్థములు, సుకృతోత్థ ములు, అపరాధోత్థములు, భక్త్యుత్థములు అని నాల్గువిధములు.

అందు, అవిద్యాస్మితరాగద్వేషాభినివేశము లను పంచ క్లేశములు (3) దుష్కృతోత్థములు వీని నన్నిటిని అవిద్యాంతర్గత ములుగనే గ్రహింపవచ్చును. ప్రారబ్ధము (ఫలోన్ముఖము), అఫలోన్ముఖము, రూఢము (బీజోన్ముఖము). బీజము అనునవి

2. ఈ విభాగము 'మాధుర్యకాదంబినీ' కారుడగు శ్రీ విశ్వనాథ చక్రవర్తి ననుసరించి.

3. చూ: యోగదర్శనము (పతంజలి-2 అ. సూ 3, 4, 5, 6, 7, 8.)

కూడ ఈ క్లేశాంతర్గతములే. వీనినే భక్తిరసామృతసింధుకారుడు ఫలోన్ముఖము, అప్రారబ్ధఫలము, కూటము, బీజము అని వ్యవహరించి యున్నాడు. సుకృతోత్థము లన, వివిధములగు భోగాభినివేశములు. కొందరు వీనినిగూడ క్లేశాంతః పాతములు గనే పరిగ్రహించుచున్నారు.

సేవాపరాధ నామాపరాధ జనితములగు అనర్థములు అపరాధోత్థములు.

దేవాలయమునకు యానారోహియై వెడలుట, పాదుకాధారియై భగవద్దర్శన మొనర్చుట, ఉత్సవదినముల (విశేష పూజ నొనర్చి) భగవత్సేవ నొనర్ప కుండుట, ఈశ్వరసాన్నిధ్యమున ప్రణామ మొనర్పకుండుట, అశుచియై భగవద్వందన మొనర్చుట, ఏకహస్త ప్రణామ మొనర్చుట, పృష్ఠభాగ ప్రదర్శనపూర్వకముగ ప్రదక్షిణము నొనర్చుట, దేవునిముందు పాదములను జాపుట, వంగి నమస్కరించుట, తదగ్రమున శయన, భక్షణ, మిథ్యాభాషణ, ఉచ్చ భాషణ, నిష్ఠురభాషణ, పరస్పర సంభాషణ, రోదన, నిగ్రహానుగ్రహములను సల్పుట, పరనిందా పరస్తుతులను, అశ్లీలవాక్యములను ఉచ్చరించుట, కంబళమును ధరించుట, అపాన వాయువునుత్యజించుట, శక్తియున్నను గౌణోపచారములను అర్పించుట(4), అనివేదితాన్న భక్షణము, ఆయా

---

4. తంత్రోక్తమగు పూజ సామాన్యముగ పంచోపచారపూజ, దశోపచారపూజ, షోడశోపచారపూజ అని త్రివిధము. షోడశోపచారపూజ ప్రత్యహ మొనర్చుట అసంభవము కాన, దశోపచారపూజ నిత్యపూజగ తచ్ఛాస్త్ర నిర్దిష్టము. ఇట్లు, పంచోపచారముల నొనర్చిన గౌణపూజ యగు

బుతుప్రాప్తములగు ఫలపుష్పముల సంగ్రహించి యర్పింపకుం
డుట, అగ్రభుక్తములును, వ్యవహృతములును నగు అన్న-వ్యం
జన-వస్త్ర-పుష్పాదుల నర్పించుట, పృష్ఠభాగమును ఈశ్వర
విగ్రహమునకు ప్రదర్శన మొనర్చుచు కూర్చుండుట, దేవతా
సాన్నిధ్యమున ఇతరుల కభివాదన మొనర్చుట, గురువు ప్రశ్నిం
చినను తత్సాన్నిధ్యమున బదులు పలుకకుండుట, తత్సాన్నిధ్య
మున తన్ను ప్రశంసించుకొనుట, దైవనింద నొనర్చుట అనునవి
భక్తసమాజమున ద్వాత్రింశత్ (32) సేవాపరాధములుగ
పరిగణింపబడుచున్నవి.(5)

ఇవిగాక, రాజాన్నభక్షణము, అంధకారగృహమున
నున్న దేవవిగ్రహమును స్పృశించుట, అవిధి పూర్వకముగ
విగ్రహసమీపమున కరుగుట, వాద్యరహితముగ మందిరద్వార
ముల తెరచుట, శునకాదిదూషిత భక్ష్యములను పూజార్థము
సంగ్రహించుట, అర్చనాకాలమున మౌనభంగ మొనర్చుట,
పూజాసమయమున మూత్రపురీషత్యాగార్థము చనుట, గంధ
మాల్యములను ముందుగ నొసగకయే ధూపము నర్పించుట,
నిషిద్ధపుష్పములతో పూజించుట, దంతధావన మొనర్చుకొనకయే
శ్రీ విగ్రహమును తాకుట—తత్సంబంధములగు కార్యముల
నొనర్చుట, స్త్రీసంగము నొనర్చియు, రజస్వలా మృతదేహ
దీపముల ముట్టుకొనియు, రక్త, నీల, అధౌత, అన్యత్యక్త, మలిన

---

వని భావము. ఉత్సవదినముల విశేషపూజ - అనగా షోడశోపచారపూజ
నొనర్పవలెనని విధి.

5. భక్తిరసామృత సింధుబిందు.

వస్త్రముల ధరించియు, మృత దేహమును చూచియు, అపానవాయువును త్యాగమొనర్చియు, క్రుద్ధతను దాల్చియు, శ్మశానమున తిరుగాడియు, అజీర్ణస్థితితో డను, కుసుంబ, శాక, హింగుభక్షణ మొనర్చియు, తైలమర్దన మొనర్చికొనియు శ్రీ విగ్రహమును స్పర్శించుట-తత్సంబంధములగు కార్యముల నాచ రించుట కూడ సేవాపరాధము లే యని గ్రహింపనగును. (6)

మఱియు, భగవచ్ఛాస్త్ర అనాదరము, ఇతర శాస్త్ర ప్రవర్తన, దేవతా సమ్ముఖమున తాంబూలమును సేవించుట, నిషిద్ధపత్రపూజ, ఆసురసమయపూజ, కాష్ఠాసనమున, లేక భూమిమీద కూర్చుండి పూజించుట, దేవతను స్నానమొనరింప జేయు సమయమున వామహస్తముతో తాకుట, శుష్కములును, యాచితములును నగు పుష్పములతో పూజించుట, పూజాకాలమున నిష్ఠీవనమును త్యజించుట, గర్వముతో తా నొనర్చిన పూజనుగురించి చెప్పకొనుట, వక్రముగ తిలకమును ధరించుట, పాదప్రక్షాళనరహితముగ దేవమందిరమున కరుగుట, ఇతరపక్వములగు వస్తువుల నర్పించుట, అభక్తుల సమ్ముఖమున పూజ నొనర్చుట, గణేశాది పంచదేవతా పూజను ఒనర్చక రేవే అర్చించుట, కాపాలికదర్శన మొనర్చియు ఘర్మాక్తశరీరము తోడను పూజనొనర్చుట, నఖస్పృష్టజలముతో దేవతను స్నాన మొనరింపజేయుట, భగవన్నామగ్రహణ పూర్వకముగ శపథ మొనర్చుట అనునవికూడ సాంప్రదాయికముగ సేవాపరాధము లని చెప్పబడుచున్నవి.

---

6. చూ: వరాహపురాణము.

సాధునింద, శివవిష్ణువుల నామరూపముల భేదబుద్ధి, గుర్వవజ్ఞ, శ్రుతి, స్మృతి, నింద, నామమాహాత్మ్యమున అర్థవాద బుద్ధి నామార్థ కువ్యాఖ్య. నామబలమున పాపప్రవృత్తి, ఇతర శుభకర్మలతో నామమును సమమొనర్చుట, శ్రద్ధాహీనునకు నామోపదేశ మొనర్చుట, మహిమను వినియు నామమునెడల అప్రీతిని వహించుటఅనునవి దశవిధనామాపరాధములు. ఈవిష యమును శ్రీ జీవగోస్వామి భక్తిరసామృతసింధు టీకయందు ప్రసంగించియున్నాడు. (7) శరణాగతి గద్యమందు శ్రీ రామాను జుడు 'భగవదపచార భాగవతాపచారాసహ్యాపచారరూప నానా విధానంతాపచారాన్...క్షమస్వ' అనునప్పు డీ యపరాధ ములనే సూచించియుండనోపును.

ఈ యపరాధశాఖల కుపశాఖ లనదగు ధనసంగ్రహము, ప్రతిష్ఠాలాభము, ఇతరసాధకుల చిత్తమును వీనిమూలమున ఆక ర్షించుట అనునవి భక్త్యుత్థములగు అపరాధములు.

ఈ యపరాధము లన్నియును భజనవలననే నివృత్తము లగును. ఈ నివృత్తి ఏకదేశవర్తిని, బహుదేశవర్తిని, ప్రాయికి, పూర్ణము, ఆత్యంతికము అని పంచవిధము. విస్తృతిభయమున చాని నిట వివరించుట లేదు.

అనర్థ నివృత్తి యైనతోడనే భజన 'నిష్ఠిత' మగును. అస్వాదు లయవిక్షేపాప్రతిపత్తి కషాయరసాస్వాదన లను అంత రాయము లైదును తొలగిపోవును. ఇవి యుండుటవల్లనే భక్తి అపరిపక్వదశయం దుండి, అనిష్ఠిత మనబడును.

---

7. చూ: పద్మపురాణము.

కీర్తన శ్రవణస్మరణసమయములలో నిద్రవచ్చుటయే లయము. కీర్తనకంటె శ్రవణమునను, శ్రవణముకంటె స్మరణసమయమునను నిద్రఅత్యంతసహజముగవచ్చును. కీర్తననలుగురితో కలిసి చేయుచుండుటవలన నిట నిద్రవచ్చుట కెక్కుడు అవకాశము లేదు. శ్రవణసమయమున తానొక్కడే ఇతరుల ప్రసంగ వ్యాఖ్యానములను వినుచున్నందువలన మనస్సు ఆ ఆలంబనమును సరిగా గ్రహింపలేకున్న అత్యంతసహజముగ నిద్రకు లోబడును. కనుక,కీర్తనశ్రవణ స్మరణములలో ఉత్తరోత్తరము అధికముగ నిద్రామాంద్యమునకు తావున్నదని గ్రహింపనగును.

శ్రవణ కీర్తన స్మరణ సమయముల వ్యావహారిక వార్తా సంపర్కము—వాచికముగగాని, మానసికముగగాని—ఉన్న, విక్షేప మనబడును. లయవిక్షేపములు లేకున్నను కీర్తనాదుల నొనర్చు సామర్థ్య మభావమైన, అప్రతిపత్తి యనబడును. ఈ సాధనాసమయమున క్రోధలోభగర్వాదుల సంస్కారము లేచిన, కాషాయమనబడును. విషయరసము భజన నాటంకపరచు స్థితియే రసాస్వాదము.

ఈఅభద్రము లన్నియును భగవద్భజనవలననే విఘాతము లగునని నుడువుట పునరుక్తి. (8) ఈ స్థితియందు భక్తి ఆత్మసంప్రసాదిని యనబడును.

8. శృణ్వతాం స్వకథాః కృష్ణః పుణ్యశ్రవణ కీర్తనః హృద్యంతస్థో హ్యభద్రాణి విధునోతి సుహృత్ సతామ్. నష్టప్రాయేష్వభద్రేషు నిత్యం భాగవత సేవయా, భగవత్యుత్తమశ్లోకే భక్తిర్భవతి నైష్ఠికీ.

...శ్రీమద్భాగవతమ్, ౧-౨-౧౭,౧౮.

ఈ నిష్ఠ భక్తివర్తిని, అనుకూలవర్తిని యని ద్వివిధము. భక్తివర్తిని మరల స్థూలముగ కాయికము, వాచికము, మానసికము అని త్రివిధము. అమానిత్వ, మానదత్వ, దయాదిగుణ శోభిత మగు నిష్ఠ అనుకూలవస్తువర్తిని యనబడును.

శ్రవణాదులయందు యత్నప్రాబల్య మున్న నిష్ఠితభక్తి యనియు, యత్నశైథిల్య మున్న అనిష్ఠిత భక్తి యనియు గ్రహింపనగును.

పూర్వోక్తమగు భజన క్రియాభ్యాసమువలన నుద్దీపితమై భక్తహృదయమున 'రుచి'జన్మించును. రుచియన శ్రవణకీర్తనాదుల కంటె అన్యతరములగు విషయములయెడ అరుచి. కనుక భజనసంబంధమగు ప్రీతియే రుచియని గ్రహణీయము.

ఈరుచి వస్తువైశిష్ట్యాపేక్షిణి, అనపేక్షిణి యని ద్వివిధము. భగవన్నామరూపగుణలీలాదుల వైశిష్ట్యమును, కీర్తన మాధుర్యమును, దేశకాలపాత్రద్రవ్యములను, ఆలంకారిక ధ్వన్యాదియుక్త మగు వాఙ్మాధుర్యమును, స్వరుచిఅనుసారము అభిలషించుటయే వస్తువైశిష్ట్యాపేక్షిణి. క్షుధామాంద్యయుక్తుడు ఏమేమి వ్యంజనము లున్నవని ప్రశ్నించునట్లు. ఈ విషయముల నపేక్షింపక నామరూపాదిశ్రవణమాత్రముననే ఆవిర్భవించునది అనపేక్షిణీ రుచి.

భజనవిషయమగు ఈ రుచి భజనీయుడగు భగవంతుని విషయముగ నొసర్చుకొనిన, ఆసక్తి యనబడును. ఈఆసక్తియే అంతఃకరణ దర్పణమును పరిశుభ్ర మొనర్చి భగవంతు డందు ప్రతిబింబించుటకు వీలొనర్చును.

తన భక్తిసూత్రములయందు నారదుడు పారాశర్య, గార్గ్య, శాండిల్యుల అభిప్రాయమును పేర్కొని యున్నాడు. పూజాదుల అనురాగము భక్తి యని పారాశర్యుడు. (9) కథాశ్రవణమున అనురాగము భక్తి యనిగార్గి. (10) అవిరోధమగు ఆత్మరతియని శాండిల్యుడు. (11) మఱియు నందే నారదుడు, ఈభక్తి గుణమహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయతాసక్తులరూపమున ప్రకాశించు ననినాడు. నారదుడు మొత్తముమీది పదకొండురూపములుగ భక్తి ప్రకాశించుననినాడు. అందులో నివి ఆరువిధములు. (12)

స్థూలముగ ఇంతవరకు వైదికభక్తియొక్క రాజ్యమని గీటు గీయవచ్చును. పారాశర్య, శాండిల్య, గార్గ్యులనిర్వచనమును, ఈ షడ్విధప్రకాశములును గూడ ఏతదంతర్గతములే యగునని ఊహచేయగలము.

'రుచి'యందు మనస్సును ఇతరవిషయములనుండిమరల్చి భగవత్పాదపద్మములకు గట్టవలసి యుండును. 'ఆసక్తి'యందు ఈశ్వరధ్యానమున విచ్ఛేదముండదు. 'రుచి' యందు చాలసేపు ఉండినను విచ్ఛేదమగును.

---

9. పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః.

10. కథాదిష్వితి గర్గః.

11. ఆత్మరత్యవిరోధేనేతి శాండిల్యః.

12. చూ: నా. భ. సూ.

